# తెలుగు భాషా బోధిని



## మొదటి పుస్తకం

ఉత్పల సత్యనారాయణాచార్య





దక్షిణ భారత హిందీ ప్రచారసభ (ఆంధ్ర)
ఖైరతాబాదు, హైదరాబాదు – 4
(ఆంధ్రప్రదేశ్)

# ముందుమాట



1. ఆంధ్రేతరులకు తెలుగు నేర్పటానికి ప్రత్యేకంగా ఉద్దేశించి శాస్త్రీయ పద్ధతుల్లో రాసిన మొదటి తెలుగు పుస్తకం ఇది. భాషా బోధన విధానంలో జరిగిన పరిశోధనలను దృష్టిలో పెట్టుకొని హిందీ మాట్లాడే విద్యావంతులైన వయోజనుల కోసం దీన్ని తయారుచేశాం.

2. ఈ పుస్తకంలో మొత్తం 24 పాఠాలున్నాయి. 10వ పాఠం తరవాత తెలుగు లిపి ప్రవేశ పెట్టాం; 11 నుంచి 16 దాకా తెలుగు దేవనాగరి లిపుల్ని సమన్వయించుకుంటూ రాశాం; 17 నుంచి 24 దాకా తెలుగు లిపిలోనే పాఠాలున్నాయి. ఆధునిక జీవద్భాష ఏదైనా నేర్చుకోటంలో ప్రాథమిక లక్ష్యం ఆ భాషా వ్యవహర్తలతో మాట్లాడగలగటం; ఆ భాషలో రాసిన ఆధునిక సాహిత్యం చదవటం, ఆపైన శ్రద్ధ ఉంటే ప్రాచీన సాహిత్యం చదవటం-ఉత్తరోత్తర సాధించదగిన లక్ష్యాలు. ఈ లక్ష్యసాధనకు అనువుగా తెలుగుదేశంలో శిష్టులు వ్యవహరించే భాషలోనే సులభసంభాషణశైలిలో ఈ పుస్తకంలో పాఠాలు రాయటం జరిగింది. శిష్టుల భాషలో కొద్దిపాటి ప్రాంతీయ భేదాలున్నా అవి ఒకరినొకరు అర్థం చేసుకోటానికి అడ్డు వచ్చేంత ఎక్కువగా లేవు; ఉదా. చెయ్యటం-చెయ్యడం; చెప్పాడు-చెప్పినాడు, మొ. వి. ఇటువంటి రూప భేదాలన్నీ శిష్టవ్యావహారికంలో మేము ఆమోదించే సాధు రూపాలే.

3. భాష అంటే అనేకవాక్య సముదాయం. అలాటి వాక్యాల నిర్మాణం ఒక్కొక్క భాషకు విలక్షణంగా ఉంటుంది. ఏ భాషలోనైనా చిన్న వాక్యాల పరిమితిని నిరూపించవచ్చు గాని, పెద్ద వాక్యాల పరిమితి నిరూపించటం సాధ్యం కాదు అంటే, 'ఇంతకు మించి పొడుగైన వాక్యం ఈ భాషలో ఉండదు' అని ఎవరూ చెప్పలేరు; కాని 'ఇంతకంటె చిన్నవాక్యం ఉండదు' అని మాత్రం చెప్పవచ్చు. అలాగే తెలుగులో 'ఇది ఏమిటి?' 'అది ఏమిటి?' అనే ప్రశ్నలకు జవాబులుగా 'ఇల్లు, పుస్తకం, గది, చెట్టు, పువ్వు', మొదలైన ఏక

పదాలను వాక్యాలుగా గూడా ప్రయోగించ వచ్చు. కాని, నేను పైన రాసిన వాక్యాల్లో దేన్నయినా, మరికొన్ని మాటలు చేర్చి ఎంత లెక్కనన్నా పొడుగించవచ్చు. ఈ విధంగా వాక్యాలు భాషలో అనంతంగా ఉన్నా వాటి నిర్మాణంలో ఏవో లెక్కపెట్ట దగినన్ని తీరులు, ఫణితులు, లేక నమూనాలు మాత్రమే ఉంటాయి. వాక్యాలు చిన్నవైనా పెద్దవైనా ఈ నమూనాలను గుర్తించి అలవరుచుకొన్నప్పుడే భాషాభ్యాసన లక్ష్యం సిద్ధిస్తుంది. పుస్తకంలో చదివి గుర్తుపెట్టుకొన్న వాక్యాలనే వాడి, కొత్త వాక్యాలు సొంతంగా సృష్టించే శక్తి లోపించినప్పుడు ఆ భాష రానట్టే. భావనలో పాతుకొన్న వాక్య నిర్మాణ ఫణితుల మూలంగా అవసరాన్ని బట్టి కొత్త వాక్యాలు సృష్టించ గలగటమే అన్య భాషాభ్యసన లక్ష్యం. ఒక్కొక్క నమూనాలో అనేక వాక్యాలు చదవి, చెప్పి, వల్లించటం వల్ల - ఆ నమూనా వ్యక్తి భావనలో అలవాటుగా పాతుకు పోతుంది.

4. ఈ పుస్తకం మొదటి పాఠంలో-'అది ఏమిటి?' 'అది పుస్తకం', 'అది నా పుస్తకం' 'అది చిన్న పుస్తకం' వంటివి నాలుగు నమూనాలున్నాయి. 'అది పుస్తకం' అనే వాక్యంలో రెండు పదాలున్నాయి. అర్థంలోనూ, రూపంలోను ఈ రెండు పదాలకున్న పరస్పర సంబంధం ఆ వాక్య నిర్మాణానికి లక్షణం. 'అది' స్థానంలో 'ఇది' చేర్చవచ్చు; 'పుస్తకం' స్థానంలో అమహద్విశేష్యం ఏక వచన రూపం ఏదైనా ఉంచవచ్చు—ఇల్లు, బొమ్మ, జెండా, గోడ, కలం, కాగితం. మొ; వి; అంటే ఈ వాక్యం నమూనా బోధపడ్డ విద్యార్థి నేర్చుకోవలసినవి కొత్తమాటలే; ఆ మాటల్ని నమూనాలో సరిపెట్టి అనేక వాక్యాలు సృష్టించుకో గలడు. ఈ శక్తి అలవడటానికి అట్టే వ్యాకరణం గూడా బోధించవలసిన అవసరం లేదు. ఇదే ఫణితిలో కూర్చిన పది పదిహేను వాక్యాలు చెప్పించి, చదివించిన మీదట వాటిల్లో ఉన్న నిర్మాణసూత్రం సహజంగా గతార్థమౌతుంది. పై పద్ధతిలో ఒక వాక్యం ఒరవడిని బట్టి అనేక వాక్యాలు కల్పించే పద్ధతిని 'ఆదేశ విధానం' (Substitution) అంటారు.

5. పై చిన్నవాక్యాన్ని 'నా, నీ, మన,' మొ, సార్వనామిక విశేషణాలవల్ల గాని, 'చిన్న, పెద్ద, కొత్త', పాత, మొ. గుణ విశేషణాల వల్ల

గాని పొడుగించవచ్చు. ఉదా : అది నా పుస్తకం, అది కొత్త పుస్తకం? ఈ విధంగా విశేషణాలు గాని అవ్యయాలు గాని చేర్చి చిన్న వాక్యాన్ని పొడి గించే పద్ధతిని 'ఆగమ విధానం' (Expansion) అంటారు. ఈ రకంగా నిష్పన్నమైన వాక్యాలకు 'కాదు' చేరిస్తే వ్యతిరేక వాక్యాలవుతాయి;'-ఆ' చేరిస్తే ప్రశ్నార్థక వాక్యాలవుతాయి. ఈ చివరి పద్ధతిలో ఒక వాక్యాన్ని మరొక వాక్యంగా మార్చటం "పరివర్తన విధానం" (Transformation) అంటారు. ఆదేశాగమ పరివర్తన విధానాలు వాక్యాల అన్యోన్య సంబంధాన్ని తెలియజేస్తాయి. భాషాభ్యాసంలో ఇవి విద్యార్థికి అలవడటం వల్లనే కొత్త వాక్యాలు సృష్టించే శక్తి ఏర్పడుతుంది.

(I) ఆదేశవిధానం :

| | |
|---|---|
| ఇది<br>అది | ఇల్లు<br>పుస్తకం<br>కలం<br>కాగితం<br>జెండా |
| ఇవి<br>అవి | ఇళ్ళు<br>పుస్తకాలు<br>కలాలు<br>కాగితాలు<br>జెండాలు |

(II) ఆగమ పరివర్తన విధానాలు :

ఇది పుస్తకం → ఇది నా పుస్తకం

↓ ↓

(a) ఇది పుస్తకమా ? → ఇది నా పుస్తకమా ?

(b) ఇది పుస్తకం కాదు. → ఇది నా పుస్తకం కాదు.

(c) ఇది పుస్తకమే. → ఇది నా పుస్తకమే.

పై విధంగా, ప్రాతిపదికగా ఉన్న ఒక చిన్న వాక్యం నుంచి ఆగమాదేశ పరివర్తన విధానాల వల్ల అనేక వాక్యాలు సృష్టించే శక్తి నేర్పటమే భాష నేర్పటం. అధ్యాపకుడు ఈ దృష్టితో పాఠాలు నేర్పాలి.

6. ప్రశ్నోత్తర పద్ధతివల్ల సంభాషణ – సులభంగా అలవడుతుంది. అధ్యాపకుడు పాఠంలో ఒక్కొక్క వాక్యం తాను చదివి, విద్యార్థులచేత చదివించి అవసరమైన చోట వాళ్ళ భాషలో అర్థం చెప్పాలి. వీలైనంత వరకూ తెలుగులోనే మాట్లాడుతూ పాఠం చెప్పటంలో ఎక్కువ ప్రయోజనం ఉంది. అర్థం అయినా కాకపోయినా అధ్యాపకుడు మాట్లాడే తెలుగుమాటల వినికిడి విద్యార్థుల అనుకరణ శక్తికి ఆలంబమౌతుంది. పాఠం అంతా చదివించి ఒక్కొక్క పాఠంలో ఉన్న నమూనాల తీరులోనే విద్యార్థులను ప్రశ్నించి వాళ్ళ చేత సమాధానాలు చెప్పించాలి. రోజూ సుమారు ఇరవై నిమిషాలన్నా పాఠంలోని నమూనా లాధారంగా విద్యార్థులు వాళ్ళలో వాళ్ళు ప్రశ్నోత్తర పద్ధతిన సంభాషించుకొనే అలవాటు చెయ్యాలి. లేకపోతే వాళ్ళకు ప్రత్యుత్తర వాక్యాలేగాని ప్రశార్థక వాక్యాలు అలవడవు.

7. హిందీలోని ధ్వనివాక్య నిర్మాణానికి, తెలుగు లోని ధ్వని వాక్య నిర్మాణానికి చాలా తేడాలున్నాయి; సమాన ధర్మాలు గూడా ఉన్నాయి. తేడా లున్న చోట్ల అభ్యాసక్లేశం ఉంటుంది. అటువంటి చోట్ల అధ్యాపకుడు ప్రత్యేక శ్రద్ధ చూపాలి; ఎ-ఏ, ఒ-ఓల భేదం, ఇప్పటి తెలుగులో కొత్తగా ఏర్పడ [æ] ఆ అనే ధ్వని (చెప్పాడు; మొ.) హిందీ మాట్లాడే వాళ్ళకు ఉచ్చారణ సమస్యలు ఈ తేడాల వల్లనే అర్థంలో మార్పు వచ్చే జంటమాటలు వాళ్ళ చేత పదే పదే చెప్పించి, రాయించి, గుర్తించే శక్తి కలిగించాలి; ఉదా. కొడి-కోడి, గొడుగు-గోడు, మొ. వి.

క్రియలు లేని వాక్యాలు హిందీలో ఉండవు. అవి తెలుగులో ఎక్కువగా వాడుతాం. అందుచేతనే ఉంది-లేదు, మొ. నక్రియాపదాలు ప్రవేశ పెట్టక ముందే ఇటువంటి వాక్యాలతోనే మొదటి నాలుగు పాఠాలు రాశాం. లేకపోతే 'ఇది పుస్తకం ఉంది' అని అలవాటు కొద్దీ అనేస్తారు. వాక్య నిర్మాణంలో ఉన్న ఇలాంటి తేడాలపై అధ్యాపకుడు దృష్టి పెట్టాలి. తెలుగు క్రియల్లో-కొంతవరకు హిందీలో లాగానే-డు, రు, వు, రు, ను, ము అనే సర్వనామ విభక్తులు, కర్తృపదసంబంధాన్ని తెలియజేసేవి వస్తాయి. ఉదా: నేను వెళ్తాను, నువ్వు వెళ్తావు, మొ వి. అయిదో పాఠంలోఅందువల్ల ఈరూప

భేదాలు లేని 'తెలుసు' అనే క్రియను ముందుగా ప్రవేశ పెట్టాం. సమాపక క్రియల్లో అటం/అడం రూపాలను, వర్తమాన భూత భవిష్యద్రూపాలనే మొదటి పుస్తకంలో ప్రయోగించాం. నామ విభక్తుల్లో ప్రధానమైన ను/ని, కు/కి, కోసం, నుంచి, మొ. వే ఈ పుస్తకంలో వాడటం జరిగింది. ఎక్కువ వాడుకలోనలిగే మాటలు రెండువందల యాభైకి మించకుండా మొదటి పుస్తకంలో ప్రవేశ పెట్టాం. అవసరాన్ని బట్టి ప్రతిపాఠంలోనూ అధ్యాపకుడు కొన్ని కొత్త మాటలు చేర్చి, నిరూపించిన వాక్య ఫణితుల్లో విద్యార్థుల చేత చెప్పించవచ్చు.

8. ఈ పుస్తకం చదివిన తరువాత తెలుగు కొంచెం మాట్లాడే శక్తి రావటమే గాక తెలుగులో ఉన్న కొన్ని ప్రధానవాక్యనిర్మాణాలు ఆధారంగా సొంత వాక్యాలు కల్పించే సామర్థ్యం విద్యార్థులకు అలవడుతుంది.

9. రెండో పుస్తకంలో 22 పాఠాలున్నాయి. మొదటి పుస్తకంలో రాని నమూనాలు, సంభాషణ శైలిలో ఈ పుస్తకంలో ప్రవేశ పెట్టాం. క్లిష్ట వాక్య రచన దీనివల్ల అలవడుతుంది. చేసి, చేస్తే, చేసినా, చెయ్యకుండా, చెయ్యక పోతే, చెయ్యకపోయినా వంటి అసమాపక క్రియారూపాలు రెండో పుస్తకంలో వస్తాయి. కొద్ది వ్యాకరణ చర్చ గూడా అక్కడే చేశాం.

ఈ పుస్తకాలు వాడిన అధ్యాపకులు, విద్యార్థులు తమతమ పఠన పాఠ నానుభవంతో ఏమన్నా మార్పులు చేర్పులు సూచిస్తే కృతజ్ఞతతో స్వీకరిస్తాం.

హైదరాబాదు
19-5-68

భద్రిరాజు కృష్ణమూర్తి
(భాషా శాస్త్ర విభాగాధ్యక్షుడు
ఉస్మానియా విశ్వవిద్యాలయం)

# సంపాదక మండలి

1. డా. బి.ఎచ్. కృష్ణమూర్తి
   భాషాశాస్త్రవిభాగాధ్యక్షులు
   ఉస్మానియా విశ్వవిద్యాలయము
2. శ్రీ ఎస్. కృష్ణారావు, ఎం. ఏ., బి. ఎడ్.
3. శ్రీ వి. పి. రాఘవాచారి, బి. ఏ., బి. ఎడ్., ఎమ్. ఎల్. సి. (ఆంధ్ర)
4. శ్రీ ఎస్. వి. శివరామశర్మ, ఎం. ఏ.
5. శ్రీ బాలచంద్ర ఆప్టే, 'శాస్త్రి'
6. చంద్రభట్ట అప్పన్నశాస్త్రి

# ఒక మాట

ఉత్తర భారతంలో తెలుగు, ఇతర దక్షిణదేశ భాషలు నేర్చుకోవాలనే కుతూహలం ఇప్పుడిప్పుడు కనుపడుతున్నది. ఉత్తర ప్రదేశ రాష్ట్రప్రభుత్వంవారు రెండు సంవత్సరాలుగా 10 కేంద్రాలలో దక్షిణ భారత భాషలు నేర్పించే పథకాన్ని అమలు పరుస్తున్నారు. వాటిలో 7 కేంద్రాలలో తెలుగు నేర్పబడుతున్నది. ఆంధ్రప్రదేశ్ నుండి కొందరుపాధ్యాయులారాష్ట్రంలో పనిచేస్తున్నారు. ఇతర ఉత్తరదేశ రాష్ట్రాలలో కూడా దక్షిణ భారత భాషలు నేర్చుకోవాలనే కోరిక కలుగుతున్నది. ఇలా నేర్చుకునే వారందరు మాతృభాష (హిందీ) బాగా వచ్చినవారే. తెలుగులో వ్యావహారిక జ్ఞానం సంపాదించుకోవాలని కోరుతున్నవారే. అలాంటి వారికి తగిన పాఠ్యపుస్తకాలు లేవు. ఈ కొరతను తీర్చటానికి దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్రశాఖ, పాఠ్యపుస్తకాల రచనకు పూనుకొన్నది. "తెలుగు భాషా బోధిని" అనే నాలుగు వాచకాలు, రెండు ఉపవాచకాలు, రెండు అనువాద రచనలు ప్రచురింప బడ్డాయి.

సాధారణంగా వ్యవహార జ్ఞానానికి భాష నేర్చుకొంటారు. ఆంధ్రేతరుల కలా ఉపయోగ పడడానికే శిష్టవ్యావహారిక భాషలో ఈ పుస్తకాలు రచింప బడ్డాయి. వీటిలో అనుసరింపబడ్డ పద్ధతి సంభాషణా పద్ధతి. అయితే శిష్ట వ్యావహారిక భాషకు నిర్దిష్టమైన వ్యాకరణం లేదు. వాడుక రూపాలే ప్రామాణికము లవుతున్నవి. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా చదివితే తెలుగు భాషలో ప్రాథమిక వ్యవహార జ్ఞానం కలుగుతుందనే మా విశ్వాసం. కృష్ణ, సుమతి, వేమన శతకాలనుండీ, కొందరాధునికవుల రచనల నుండీ పద్యాలు, గేయాలు

కూడా చేర్చాము. తమ రచనలను ఈ పుస్తకాలలో చేర్చడానికి అనుమతించిన డా॥ సి. నారాయణరెడ్డి, 'కరుణశ్రీ' గార్లకు మా కృతజ్ఞతలు.

భారతీయ భాషలలో, హిందీ తర్వాత తెలుగే అధిక సంఖ్యాకుల భాష. హిందీ, తెలుగు-రెండు భాషలకూ విపుల శబ్దరాశిలో సంస్కృతమే మాతృక. కనుక ద్రావిడభాష లన్నింటిలో తెలుగే హిందీ భాషీయులకు చాలా సులభంగా అర్థం కాగల భాష. ఈ పుస్తకాల ద్వారా ఆంధ్రప్రదేశ చరిత్ర, సంస్కృతి, జనుల జీవన విధానం, ప్రముఖ నాయకుల పరిచయం కలిగించే ఉద్దేశ్యం కూడా పెట్టుకొన్నాము. మా యీ ప్రయత్నం తెలుగు, హిందీ ప్రాంతాల జనుల సన్నిహితత్వానికి దోహదం చేయగలదని ఆశిస్తున్నాము.

మా యీ కృషిలో తోడ్పడిన డా॥ భద్రిరాజు కృష్ణమూర్తి గారికి, సంపాదక మండలిలోని ఇతర సభ్యులకు, రచయితలకు, చిత్రకారులకు, పుస్తకాలను అందంగా అచ్చొత్తించిన ముద్రాపకులకు, ఆర్థిక సహాయ మందజేసిన కేంద్ర ప్రభుత్వ విద్యా మంత్రిత్వ శాఖ వారికీ మా హార్దిక అభివందనాలు.

**స్వామీ రామానందతీర్థ**

అధ్యక్షులు

దక్షిణ భారత హిందీ ప్రచార సభ,

(ఆంధ్ర.)

హైదరాబాదు,

20—3—1968.

# प्रस्तावना

भारत की भिन्न भिन्न भाषाओं के बीच ऐक्य की भावना तथा व्यवहार की अनुकूलता लाने के विचार से दक्षिण भारत हिन्दी प्रचार सभा पिछली अर्ध शताब्दी से हिन्दी प्रचार में संलग्न रही है। महात्माजी की प्रेरणा से सभा ने एक और दिशा में भी कदम उठाया है। वह है, सभी भारतीयभाषाओं तथा साहित्यों में हिन्दी के द्वारा सामंजस्य तथा समचेतना उत्पन्न करना, जिससे देश में राष्ट्रीयता की पुष्टि होती रहेगी।

इधर शिक्षा के क्षेत्र में, केन्द्र सरकार ने त्रिभाषा सूत्र पर अपना विश्वास प्रकट किया और हिन्दी भाषी-प्रान्तों में दक्षिण भारतीय भाषाओं के अध्ययन के प्रति उत्साह दिखाया जाने लगा है। तेलुगु भाषा के अध्ययन तथा अध्यापन के लिए उपयोगी पाठ्य पुस्तकें तैयार कर सहायता पहुँचाने का काम आंध्र प्रदेश की इस सभा ने अपने ऊपर लिया। फलस्वरूप, इस वर्ष ८ पुस्तकें प्रकाशित की जा रही हैं।

तेलुगु आंध्र प्रदेश की भाषा है। हिन्दी के बाद भारत में यही अधिक प्रचलित है। द्राविड परिवार में उत्पन्न होकर संस्कृत तथा प्राकृत से विकास पा जाने के कारण इसे भारत की प्रतिनिधि भाषा कहा जा सकता है। तेलुगु की साहित्यिक शैली लगभग एक हजार वर्ष पूर्व प्रचलित ढांचे पर खड़ी है। इस दीर्घकाल में जो जो परिवर्तन होते आए हैं वे सब आज की व्यावहारिक भाषा में सुनिश्चित हुए हैं। इस वर्तमान शैली को 'शिष्ट व्यावहारिक भाषा' कहा जाता है, और इसी में आधुनिक युग का अधिकांश साहित्य रचा जा रहा है। इन आठ पुस्तकों में इस नूतन शैली का बहु-प्रचलित रूप प्रस्तुत किया गया है। अन्य भाषा-भाषी इसे सीख कर सरलता से विचार विनिमय कर सकेंगे।

इस पुस्तक माला की प्रथम दो पुस्तकें संभाषण के लिए अनुकूल संरचनाओं (स्ट्रक्चरों) के आधार पर लिखी गई हैं। तीसरी और चौथी में ऐसा विषय दिया गया है जिससे पाठक आन्ध्र के लोक-जीवन, इतिहास, साहित्य, कलाकौशल आदि का सामाजिक ज्ञान प्राप्त कर सके। अनुवाद के दो भागों में व्याकरणिक रचना की सामान्य रीतियाँ हिन्दी में समझाई गई हैं और साथ-साथ अनुवाद के लिए अभ्यास भी दिए गए हैं। अंतिम दो पुस्तकें अपठित हैं। प्रारंभिक पुस्तक में दिया गया नागरी लिप्यन्तरण तथा चारों पाठ्य-पुस्तकों के अन्त में दी गई शब्दार्थ सूचियाँ इन पुस्तकों की उपयोगिता को बढ़ा देती हैं।

हम आशा करते हैं कि हिन्दी भाषा-क्षेत्र में इन पुस्तकों का समुचित उपयोग होगा और सभा को इस दिशा में प्रोत्साहन मिलेगा।

हैदराबाद
20-3-1968

अध्यक्ष
दक्षिण भारत हिन्दी प्रचार सभा (आंध्र)

# विशेष सूचनाएँ

1. तेलुगु स्वरांत भाषा है। राम्, भीम्, देश्–जैसा व्यंजनांत उच्चारण इसमें नहीं होता। शब्दों के अंत में तथा मध्य में आनेवाले 'अ' स्वर का पूरा पूरा, मुँह खोलकर, उच्चारण किया जाता है। उच्चारण के इस भेद पर ध्यान देना आवश्यक है।

2. 'ऋ' का उच्चारण तेलुगु में 'रु' जैसा होता है। अतः 'ऋण', 'ऋषि', 'कृष्ण'–जैसे शब्द 'रुण', 'रुषि', 'क्रुष्ण'–बोले जाते हैं।

3. 'ए' और 'ओ' हिन्दी में दीर्घ स्वर हैं। तेलुगु में इन दीर्घ स्वरों के अतिरिक्त इनके ह्रस्व रूप भी मौजूद हैं। ఎ, ఒ तेलुगु लिपि में ह्रस्व अक्षर हैं, तथा ఏ, ఓ दीर्घ। नागरीलिपि में व्यक्त करने के लिए इन पुस्तकों में ఎ के लिए ऍ तथा ఒ के लिए ओ॑ के संकेतों का उपयोग किया गया है। हिन्दी के **एहसान, एकायक** आदि शब्दों में ह्रस्व ए (ఎ) तथा **ओसारा, सोनार, लोहार** जैसे शब्दों में ह्रस्व ओ (ఒ) का उच्चारण होता है।

4. व्यावहारिक तेलुगु की कुछ क्रियाओं में 'आ' की एक विशेष प्रकार की ध्वनि उच्चरित होती है। नागरी और तेलुगु लिपियों में इस के लिए कोई चिह्न न होने से इन पुस्तकों में जगह-जगह अक्षर के नीचे एक छोटी लकीर देकर संकेत किया गया है; जैसे చెప్పాడు, అమ్మాడు चेप्पाडु, अम्माडु। अंग्रेजी के **Taxi** (टैक्सी) **Atom** (ऐटम) के **a** में वही विशेष ध्वनि सुनाई देती है। इस विशेष उच्चारण पर ध्यान देना चाहिए।

5. (तालव्य) च, ज (చ జ) के अतिरिक्त तेलुगु में दन्त्य उच्चारणवाले च़, ज़ (చ జ) भी प्रचलित हैं। ये ध्वनियाँ मराठी में भी पाई जाती हैं। చ జ का यह भिन्न उच्चारण तेलुगु में मुख्य माना जाता है। यद्यपि कुछ वर्षों से చ జ की शिरोरेखा तेलुगु की लेखन प्रणाली से उठती जा रही है, प्रस्तुत पाठ्य पुस्तकों में पाठकोंके लाभार्थ यह संकेत यथासंभव रखा गया है। इस के लिए नागरी में च, ज के नीचे बिंदी दी गई है।

6. तेलुगु वर्णमाला में साधारण 'र' (ర) के अतिरिक्त कुछ घर्षण ध्वनिवाला ऱ (ఱ) भी मौजूद है। परंतु इन पाठ्य

पुस्तकों में द्वित्व .रं (ఱ) को छोड़कर अन्यत्र साधारण र (ర) का ही उपयोग हुआ है ।

7. दन्त्य ल (ల) के अलावा तेलुगु में मूर्धन्य ळ (ళ) का भी उपयोग विस्तार से होता है । मराठी की लिपिमाला में इस के लिए ळ अक्षर विद्यमान है । कला, महिला, वेला ताल- जैसे संस्कृत शब्द तेलुगु में कळ (కళ) महिळ (మహిళ) वेळ (వేళ) ताळं (తాళం) बन जाते हैं ।

8. "श" (శ) का उच्चारण हिन्दी में "ष" (ష) जैसा होता है । (उदाः शरबत्, तमाशा, शाम) परंतु तेलुगु में इस का शुद्ध तालव्य उच्चारण ही होता है, मूर्धन्य नहीं ।

9. प्रथम पुस्तक में दी गई लिपि संबंधी सामग्री से लाभ उठाने पर विद्यार्थी तेलुगु लिपि अच्छी तरह सीख सकते हैं जिससे बिना नागरी लिप्यंतरण के ही दूसरी पुस्तक पढ़ना आसान हो जायगा ।

10. प्रथम दो पुस्तकों के हर पाठ में रचना के जो ढाँचे (**Structures**) प्रस्तुत किये गये हैं, उनके नमूने पर अध्यापक अभ्यास-वाक्यों की संख्या बढ़ा सकते हैं। इसके द्वारा रचना तथा बोलने की शक्ति सुदृढ़ हो जायेगी ।

11. 'रचना और अनुवाद' के दोनों भागों में दिये गये अभ्यास के वाक्य नमूने के तौर पर हैं । अध्यापक उनकी संख्या आवश्यकतानुसार बढ़ा सकते हैं। उनका मौखिक अभ्यास अधिक लाभकारी होगा।

12. तीसरी तथा चौथी पुस्तकों में वेमना, सुमति तथा कृष्ण-शतक से दिये गमे पद्य प्राचीन साहित्यिक शैली के नमूने हैं; गेय पद आधुनिक व्यावहारिक शैली के हैं। शतकों के पद्य कंठस्थ करने योग्य हैं।

13. यद्यपि व्यवहारिक तेलुगु में संधि विधान का पालन नहीं होता, फिर भी दो-एक नियम ऐसे हैं जिनका पालन साधारण वक्ता भी अनजाने ही कर लेता है । जब दो शब्द एकसाथ बोले जाते हैं, तब इस भाषा की प्रकृति के अनुसार दूसरे शब्द के प्रथम स्वर का आगम पिछले शब्द के अन्तिम स्वर की जगह हो जाता है । जैसे

నీకు + ఎందుకు (नीकु + एँदुकु) मिलकर నీకెందుకు (नीकेंदुकु) हो जाता है। इसी प्रकार ఎక్కడ + ఉన్నది = ఎక్కడున్నది (एक्कड + उन्नदि = एक्कडुन्नदि); అవును + ఔను = అవునౌను (अवुनु + औनु = अवुनौनु)। शब्द के साथ प्रत्यय आदि जोड़ते समय भी ऐसा ही स्वरपरिवर्तन होता है, जैसे: నవ్వుతు + ఉన్న = నవ్వుతున్న (नव्वुतु + उन्न = नव्वुतुन्न) చెప్పు + అక = చెప్పక, (चेप्पु + अक = चेप्पक), కొట్టు + ఇంచు + కొట్టించు (कोट्टु + इंचु = कोट्टिंचु) इस विधान को "पररूप संधि" कहते हैं।

14. రాబోవు (राबोवु), తినగలను (तिनगलनु), చెప్పదగిన (चेप्पदगिन) इन शब्दों में रेखांकित బో, గ, ద संधि के कारण से बदले हुए वर्ण हैं; उनका विभजन यों होगा :— రాన్ + పోవు = రాబోవు (रान् + पोवु = राबोवु), తినన్ + కలను = తినగలను (तिनन् + कलनु = तिनगलनु), చెప్పన్ + తగిన = చెప్పదగిన (चेप्पन् + तगिन = चेप्पदगिन) इस रीति को "द्रुत संधि" कहा जाता है। संधि की इन दो रीतियों को अच्छी तरह समझना चाहिए।

15. व्यावहारिक तेलुगु भाषा संयोगावस्था (**Synthesis**) की प्रक्रिया से प्रभावित होती जा रही है। इस कारण साधारण पाठक को शब्दों के पूर्व रूप जानना कठिन हो जाता है। जैसे—తీసికొన్నాం = తీసి + కొని + నాము, నేర్చుకోవాల్సింది = నేర్చు + కొన + వలసి + నది, చేసెయ్యాలి = చేసి + వేయ + వలె, తినేశాడు = తిని + వేసి + నాడు. भाषा सीखनेवालों को व्यावहारिक रूपों के साथ शब्दों के स्वरूप को भी जानना प्रयोजनकारी होगा।

16. अन्य संकेतों का विवरण :— క్రి. ధా = క్రియాధాతువు क्रि. धा. = क्रियाधातु। वि = विशेषण। क्रि. वि. = क्रिया विशेषण; ए. व. = एकवचन। ब. व. = बहुवचन। महत् लिं. = मनुष्यों में पुरुष बोधक लिंग। महती = मनुष्यों में स्त्री बोधक लिंग; अमहत् लिं. = अप्राणिवाचक—वृक्ष, पशु पक्षी आदि का लिंग।

—:o:—

# तेलुगु भाषा बोधिनि

(मों॑दटि पुस्तकं)

## ओं॑कटो पाठं



अदि एमिटि ?
अदि जें॑ण्डा .



इदि एमिटि ?
इदि कलं .



अदि एमिटि ?
अदि पुस्तकं .

इदि एमिटि ?

अदि कुर्ची .



अदि एमिटि ?

अदि बो॑म्म .

अदि मन जे॑ण्डा .

इदि चित्र पुस्तकं .

अदि पे॑द्द कागितं .

अदि मी कुर्ची .

इदि ना बो॑म्म .

---

# रॆॅण्डो पाठं



अवि एमिटि ?

अवि जॆॅण्डालु .



इवि एमिटि ?

इवि कलालु .

अवि एमिटि ?

इवि कागितालु .



इवि एमिटि ?

अवि पुस्तकालु .



इवि एमिटि ?
अवि कुर्चीलु .

अवि एमिटि ?
अवि बोॅम्मलु .

अवि मन जेॅण्डालु .
इवि चिन्न पुस्तकालु .
अवि पेॅद्द कागितालु .
अवि मो कुर्चीलु .
इवि ना बोॅम्मलु .

आ पुस्तकं चिन्नदि .
ई पुस्तकालु पेॅद्दवि .
ई रोजु ए वारं ?
ई रोजु सोमवारं .

# मूडो पाठं



अतनु ऎँवरु ?
अतनु रामय्य .

इतनु ऎँवरु ?
इतनु नरसय्य



आयन ऎँवरु ?
आयन डाक्टरु गारु .

ईयन ऎँवरु ?
ईयन नागय्य .

आमें ऎँवरु ?
आमें सीतम्म .

ईमे ऍवरु ?
ईमे कमलम्म .

आ अम्मायि ऍवरु ?
आ अम्मायि राध .

ई अब्बायि ऍवरु ?
ई अब्बायि माधवराव् .



वाळ्ळु ऍवरु ?
वाळ्ळु कार्मिकुलु .



वीळ्ळु ऍवरु ?
वीळ्ळु रैतुलु .

वारु ऍवरु ?
वारु मा नान्न

मीरु ऍवरु ?

नेनु विद्यार्थिनि .

मेमु विद्यार्थुलं .



वीरु ऍवरु ?

वीरु मा स्नेहितुलु, नरसिंगरावु गारु .

---

# नालुगो पाठं

मी पेरु एमिटंडि ?
ना पेरु रामय्य .

अतनि पेरु एमिटि ?
अतनि पेरु नरसय्य .

आमें पेरु एमिटि ?
आमें पेरु सीतम्म .



ईमें पेरु एमिटि ?
ईमें पेरु कमलम्म .

मी अब्बायि पेरु एमिटि ?
मा अब्बायि पेरु माधवराव‍ु .

आ अम्मायि पेरु एमिटि ?
आ अम्मायि पेरु राध .

मी स्नेहितुडि पेरु एमिटि ?
मा स्नेहितुडि पेरु नरसिंगराव् .

आयन पेरु एमिटि ?
आयन पेरु रामय्य .

ई ऊरि पेरु एमिटि ?
ई ऊरि पेरु षाद्नगरु .

मी नान्न गारि पेरु एमिटि ?
मा नान्न गारि पेरु रामय्य गारु .

---

# अयिदो पाठं

अदि ऍवरि पुस्तकं ?

अदि ना पुस्तकं .

अवि ऍवरि बॊम्मलु ?

अवि मा बॊम्मलु .

इदि ऍवरि कलं ?

इदि नी कलं .

अवि ऍवरि चॆप्पुलु ?

अवि मी चॆप्पुलु .



अदि ऍवरि पत्रिक ?

अदि अतनि पत्रिक .

अवि ऍवरि कागितालु ?

अवि वाळ्ळ कागितालु .

अदि आयन पुस्तकं .

अवि आयन चॆप्पुलु .

इदि माधवरावु पुस्तकं .

अदि ना तॆलुगु पुस्तकं .



अदि ना चॆक्क बॊम्म .

इदि नी पात कलं .

अवि मी अम्मायि चॆप्पुलु .




इदि अतनि हिन्दी पत्रिक .

अवि वाळ्ळ तॆल्ल कागितालु .

आ अम्मायि ऎवरि कूतुरु ?
आ अम्मायि रामय्य गारि कूतुरु .

ई अब्बायि ऎवरि कुमारुडु ?
ई अब्बायि नागय्य गारि कुमारुडु .

# आरो पाठं

नीकु आयन पेरु तॆलुसा ?
नाकु आयन पेरु तॆलुसु .
आयन पेरु रामाराव‍ु .

मीकु आमॆ पेरु तॆलुसा ?
माकु आमॆ पेरु तॆलियदु .

आमॆकु आ अब्बायि पेरु तॆलुसा ?
आमॆकु आ अब्बायि पेरु तॆलियदु .

आ अब्बायिकि आमॆ पेरु तॆलुसा ?
आ अब्बायिकि आमॆ पेरु तॆलुसु .

आयनकु मी इल्लु तॆलुसा ?
आयनकु मा इल्लु तॆलुसु .



मीकु वाळ्ळ पेर्लु ते॑लुसा ?
माकु वाळ्ळ पेर्लु ते॑लियवु .
इतनिकि वाळ्ळ पेर्लु ते॑लुसु .

आमे॑ पेरु एॅवरिकि ते॑लुसु ?
आमे॑ पेरु राममूर्तिकि ते॑लुसु .

आमे॑ पेरु रंगारावुकु ते॑लियदा ?
आमे॑ पेरु रंगारावुकु ते॑लियदु .

एमंडि ! मी पेरु एमिटि ?
ना पेरु कमल .

मीकु ते॑लुगु ते॑लुसा ?
माकु ते॑लुगु ते॑लियदु, हिंदी ते॑लुसु

वारिकि हिंदी ते॑लुसा ?
वारिकि हिंदी ते॑लियदु, ते॑लुगु ते॑लुसु .

मी ओट्टु एॅवरिकि ?
ना ओट्टु मीके .

---

## एडो पाठं

ई इल्लु एँवरिदि ?
ई इल्लु मादि .

आ कागितालु एँवरिवि ?
आ कागितालु नावि .



आ आवुलु एँवरिवि ?
आ आवुलु मावि .



ई उंगरं एँवरिदि ?
ई उंगरं सोतम्मगारिदि .

ई चेँप्पुलु एँवरिवि ?
ई चेँप्पुलु राधवि .

आ कुर्चीलु ऍवरिवि ?
आ कुर्चीलु रामय्यवि .

ई इळ्ळु ऍवरिवि ?
ई इळ्ळु नरसय्यवि .



आ मेकलु ऍवरिवि ?
आ मेकलु अतनिवि .



ई च़िच्चुबुड्डि ऍवरिदि ?
ई च़िच्चुबुड्डि ई पिल्लवाडिदि .



ई कुक्कलु ऍवरिवि ?
ई कुक्कलु वाळ्ळवि .

ई गोँडुगू चेँप्पुलू ऍँवरिवि ?
ई गोँडुगू चेँप्पुलू मा तातगारिवि .



आ दुकाणं ऍँवरिदि ?
आ दुकाणं नरसय्यदि .

ई अद्दं दुव्वेँन ऍँवरिदि ?
ई अद्दं दुव्वेँन कमलम्मगारिवि .

आ चिन्न चेँप्पुलु ऍँवरिवि ?
आ चिन्न चेँप्पुलु मा अम्मायिवि .

ई तेँलुगु पुस्तकालु मा अम्मायिवि .
ई हिंदी पुस्तकं मा अब्बायिदि .

---

## ऍनिमिदो पाठं

मीदि एऊरु ?

मादि पालमूरु .

वारिदि ए ऊरु ?

वारिदि गुण्टूरु .

वाळ्ळदि ए ऊरु ?

वाळ्ळदि चित्तूरु .

आमॅदि ए ऊरु ?

आमॅदि नेल्लूरु .

आ अम्मायिदि ए ऊरु ?

आ अम्मायिदि विशाखपट्टणं .

आ अब्बायिदि ए ऊरु ?

आ अब्बायिदि श्रीकाकुळं .

नरसय्यदि ए ऊरु ?

नरसय्यदि वरंगल्लु .

रामय्यगारिदि ए ऊरु ?

रामय्यगारिदि हनुमकॉण्ड .

कमलम्मगारिदि ए ऊरु ?
कमलम्मगारिदि विजयवाड़ .

ई पुस्तकं नीदा ? इतनिदा ?
ई पुस्तकं नादि कादु, इतनिदि .

ई चॆप्पुलु मीवा ? वाळ्ळवा ?
ई चॆप्पुलु मावि कावु, वाळ्ळवि .



आ संचि आमॆदा ? आयनदा ?
आ संचि आमॆदि कादु, आयनदि .

ई गोडुगु नादा ? मीदा ?
ई गोडुगु नादि कादु, मीदि .

---

# तोॅम्मिदो पाठं

अदि ऍन्त ?
अदि ओॅकटि .

अवि ऍन्नि ?
अवि रॆॅण्डु .



इवि ऍन्नि रूपायलु ?
इवि अयिदु रूपायलु .

अवि ऍन्नि पैसलु ?
अवि याभै पैसलु .

ई पुस्तकं धर ऍन्त ?
ई पुस्तकं धर रॆॅण्डु रूपायल याभै पैसलु .

मी वयस्सु ऍन्त ?
ना वयस्सु इरवै एंड्लु .

मीकु ऍन्नि एंड्लु ?

नाकु मुप्फै एंड्लु .

आ अम्मायि वयस्सु ऍन्तो मीकु तॆलुसा ?

आ अम्मायि वयस्सु ऍन्तो नाकु तॆलियदु .

मी तम्मुडिकि ऍन्नि एंड्लु ?

मा तम्मुडिकि पदिहेनु एंड्लु .

राधकु ऍन्नि एंड्लु ?

राधकु ऍन्नि एंड्लो नाकु तॆलियदु .

आमॆकु नलभै एंड्लु ?

वारि अम्मायिकि इरवै एंड्लु .

---

## पदो पाठं



राजू ! इटु रा .

राधा ! इटु राकु .



मीरु इद्दरू इटु रंडि .

मीरु इद्दरू अटु राकंडि .



राजू ! नीवु मॊदटि पाठं चदुवु .

राधा ! नीवु चिवरि पाठं चदवकु .

मीरु इद्दरू तॆलुगु चदवंडि .

मीरु चॆड्ड नवललु चदवकंडि .



राधा ! नीवु इक वॆळ्ळु .

राजू ! नीवु वॆळ्ळकु .

मीरु हैदराबादु वे॑ळ्ळंडि .
मीरु मद्रासु वे॑ळ्ळकंडि .

अम्मायी ! इक्कड कूर्चो॑ .
अब्बायी ! अक्कड कूर्चो॑कु .

रामय्य गारू ! रंडि, कूर्चो॑ण्डि .
सीतम्म गारू ! मीरु कूडा रंडि, कूर्चो॑ण्डि .
मीरु अक्कड कूर्चो॑कंडि .

---

# वर्णमाला





త థ ద ధ న
त थ द ध न
प फ ब भ म
य र ल ळ व
श ष स ह क्ष
क का कि की कु
कू कृ के कै कै
को को कौ कं कः

# अभ्यास

| | |
|---|---|
| అతను | ఎంత |
| ఆవు | ఏమిటి |
| ఇతను | ఐదు |
| ఈయన | ఒకటి |
| ఉంగరం | ఓటు |
| ఊరు | ఔషధం |
| ఋషి | అందరు |

# बारहखड़ी

| | | |
|---|---|---|
| కాకి | ా | काकि |
| కిటికి | ి | किटिकि |
| కీడు | ీ | कीडु |
| కుర్చీ | ు | कुर्ची |
| కూలి | ూ | कूलि |

| | | |
|---|---|---|
| కృప | ృ | कृप |
| కెరటం | ె | कॆरटं |
| కేక | ే | केक |
| కైదు | ై | कैदु |
| కొండ | ొ | कॊण्ड |
| కోతి | ో | कोति |
| కౌలు | ౌ | कौलु |
| కంప | ం | कंप |

## संयुक्ताक्षर

| | | |
|---|---|---|
| కుక్క | ్క | कुक्क |
| మూర్ఖుడు | ఖ | मूर्खुडु |
| ముగ్గురు | ్గ | मुग्गुरु |
| దీర్ఘం | ఘ | दीर्घं |
| కుర్చీ | చ | कुर्ची |

| | | |
|---|---|---|
| గజ్జెలు | ్జ | गज्जॆलु |
| బుట్ట | ్ట | बुट्ट |
| షష్ఠి | ్ఠ | षष्ठि |
| రెడ్డి | ్డ | रॆड्डि |
| విష్ణువు | ్ణ | विष्णुवु |
| పుస్తకం | ్త | पुस्तकं |
| అర్థం | ్థ | अर्थं |
| ఎద్దు | ్ద | ऎद्दु |
| యుద్ధము | ్ధ | युद्धमु |
| అన్న | ్న | अन्न |
| కప్ప | ్ప | कप्प |
| నిష్ఫలం | ్ఫ | निष्फलं |
| మబ్బు | ్బ | मब्बु |
| నిర్భయం | ్భ | निर्भयं |
| అమ్మ | ్మ | अम्म |

| | | |
|---|---|---|
| సూర్యుడు | ్య | सूर्युडु |
| చంద్రుడు | ్ర | चंद्रुडु |
| పిల్లి | ్ల | पिल्लि |
| పళ్ళెం | ్ళ | पळ्ळें |
| దువ్వాన | ్వ | दुव्वॆन |
| దుశ్శాసనుడు | ్శ | दुश्शासनुडु |
| లక్ష | ్ష | लक्ष |
| బస్సు | ్స | बस्सु |
| అర్హత | ్హ | अर्हत |

# अभ्यास

| | | |
|---|---|---|
| అక్కడ | ఇల్లు | చదువు |
| అటు | ఇవి | చెడుబుద్ధి |
| అది | ఈమె | చిత్తూరు |
| అబ్బాయి | ఎవరు | చిన్నది |
| అమ్మాయి | ఎన్ని | చెక్కబొమ్మ |
| అయిదు | ఏండ్లు | చెడ్డ నవలలు |
| అవి | కమలమ్మ | చెప్పులు |
| ఆమె | కలం | జెండా |
| ఆయన | కాగితం | డాక్టరు గారు |
| ఇక | కార్మికులు | తమ్ముడు |
| ఇక్కడ | కుక్క | తెలియదు |
| ఇటు | కుర్చీ | తెలుగు |
| ఇది | కూర్చోండి | తెలుసు |
| ఇద్దరు | గుంటూరు | తెల్ల కాగితాలు |
| ఇరవై | గొడుగు | దుకాణం |

ధర
నరసయ్య
నరసింగరావు
నలభై
నాగయ్య
నాన్నగారు
నీవు
నెల్లూరు
నేను
పత్రిక
పదిహేను
పాత కలం
పాలమూరు
పెద్దది
పేరు
పైసలు
బొమ్మ

మనం
మాధవరావు
మీరు
ముప్పై
మేక
మొదటి పాఠం
యాభై
రంగారావు
రాజు
రాధ
రామమూర్తి
రామయ్య
రూపాయలు
రెండు
రేడియో
రైతులు
వయస్సు

వరంగల్లు
వంద
వారు
వాళ్ళు
విజయవాడ
విద్యార్థి
విశాఖ పట్టణం
వీళ్ళు
వెళ్ళు
శ్రీకాకుళం
సంచి
సీతమ్మ గారు
స్నేహితుడు
హనుమకొండ
హిందీ పత్రిక
హైదరాబాదు.

# పదకొండో పాఠం

# पद्‌कोॅण्डो पाठं



అతను పండ్లు అమ్మటం లేదు

अतनु पंड्लु अम्मटं लेद्दु .

నేను పండ్లు కొనటం లేదు.

नेनु पंड्लु कोॅनटं लेद्दु .

మీరు తెలుగు చదవటం లేదు.

मीरु तॆलुगु च़दवटं लेद्दु .

వారు హిందీ రాయటం లేదు.

वारु हिंदी रायटं लेद्दु .

ఆయన కొట్టటం లేదు తిట్టటం లేదు.

आयन कोॅट्टटं लेद्दू तिट्टटं लेद्दु .

ఈయన సినిమా చూడటం లేదూ పాటలు వినటం లేదు.

ईयन सिनीमा चूडटं लेद्दू पाटलु विनटं लेद्दु .

ఆమె మాట్లాడటం లేదూ పోట్లాడటం లేదు.

आमॆ माट्लाडटं लेद्दू पोट्लाडटं लेद्दु .

నేను బజారు వెళ్ళటం లేదూ కాయగూరలు తేవటం లేదు.

नेनु बज़ारु वॆळ्ळटं लेद्दू कायगूरलु तेवटं लेद्दु .

మీరు రాయటం కంటె చదవటం మంచిది.

मीरु रायटं कंटॆ चदवटं मंचिदि .

కమల కంటె విమల పెద్దది

कमल कंटॆ विमल पॆद्दिदि .

రాధకంటె మాధవరావు పెద్దవాడు.

राध कंटॆ माधवराव पॆद्दवाड्डु .

లలిత కంటె రాధ చిన్నది.

ललित कंटॆ राध चिन्नदि .

ఆమెకంటె ఆయన పెద్దవారు.

आमॆ कंटॆ आयन पॆद्दवारु .

వాళ్ళు మనకంటె చిన్నవాళ్ళు.

वाळ्ळु मनकंटॆ चिन्नवाळ्ळु .

నీవు నా కంటె పెద్దదానివి.

नीवु नाकंटॆ पॆद्ददानिवि .

నేను నీ కంటె చిన్నదాన్ని.

नेनु नीकंटॆ चिन्नदान्नि .

నీవు నా కంటె పెద్దవాడివి.

नीवु नाकंटॆ पॆद्दवाडिवि .

నేను నీ కంటె చిన్నవాణ్ణి.

नेनु नीकंटॆ चिन्नवाण्णि .

మీరు నా కంటె చాలా పెద్దవారు.

मीरु नाकंटॆ चाला पॆद्दवारु .

## పన్నెండో పాఠం

## पन्नॆण्डो पाठं



మీరు బాపూజీని చూశారా ?

**मीरु बापूजीनि चूशारा ?**

నేను బాపూజీని చూడలేదు.

**नेनु बापूजीनि चूडलेदु .**

నేను నెహ్రూ గారిని చూశాను.

**नेनु नेहरू गारिनि चूशानु .**

మీ అబ్బాయి కుక్కను కొట్టాడా ?

**मी अब्बायि कुक्कनु कॊट्टाडा ?**

మా అబ్బాయి కుక్కను కొట్టలేదు.

**मा अब्बायि कुक्कनु कॊट्टलेदु .**

మా అబ్బాయి మేకను కొట్టాడు.

**मा अब्बायि मेकनु कॊट्टाडु .**

నేను నిన్న ఉదయం వాళ్ళను పిలిచాను.

नेनु निन्न उदयं वाळ्ळनु पिलिचानु .

వాళ్ళు నిన్న సాయంత్రం నన్ను పిలిచారు.

वाळ्ळु निन्न सायंत्रं नन्नु पिलिचारु .

ఆయన ఆమెను చూశారు.

आयन आमॆनु चूशारु .

ఆమె ఆయన్ను చూడలేదు.

आमॆ आयन्नु चूडलेदु .

మేము మిమ్మల్ని పిలిచాము.

मेमु मिम्मल्नि पिलिचामु .

మీరు మమ్మల్ని పిలవలేదు.

मीरु मम्मल्नि पिलवलेदु .

నేను రాధను చూశాను.

नेनु राधनु चूशानु .

రాధ నన్ను చూడలేదు.

राध नन्नु चूडलेदु .

రాధ నిన్ను చూసింది.

राध निन्नु चूसिंदि .

రాధా-వసంతా నిన్ను చూశారు.

राधा-वसंता निन्नु चूशारु .

నీవు అతణ్ణి పుస్తకం అడిగావా ?

**नीवु अतण्णि पुस्तकं अडिगावा ?**

నేను అతణ్ణి పుస్తకం అడిగాను.

**नेनु अतण्णि पुस्तकं अडिगानु .**

నేను ఇతణ్ణి పుస్తకం అడగలేదు.

**नेनु इतण्णि पुस्तकं अडगलेदु .**

మీరు ఎవర్ని పిలిచారు ?

**मीरु ऍवर्नि पिलिचारु ?**

నేను మిమ్మల్ని పిలిచాను.

**नेनु मिम्मल्नि पिलिचानु .**

నేను రెడ్డిగారిని పిలవలేదు.

**नेनु रॆड्डिगारिनि पिलवलेदु .**

మీరు నిన్న ఏ సినీమా చూశారు ?

**मीरु निन्न ए सिनीमा चूशारु ?**

నేను నిన్న కాబూలీవాలా సినీమా చూశాను.

**नेनु निन्न काबूलीवाला सिनीमा चूशानु .**

నీవు కూడా నిన్న సినీమా చూశావు.

**नीवु कूडा निन्न सिनीमा चूशावु .**

నేను ఒకణ్ణే నిన్న సినీమా చూడలేదు.

**नेनो ऒकण्णे निन्न सिनीमा चूडलेदु .**

మీరు భోజనం చేశారా?

**मीरु भोजनं चेशारा ?**

నేను భోజనం చేయలేదు.

**नेनु भोजनं चेयलेदु .**

నేను స్నానం చేశాను.

**नेनु स्नानं चेशानु .**

నీవు రొట్టెలు తిన్నావా?

**नीवु रॊट्टॆलु तिन्नावा ?**

నేను రొట్టెలు తినలేదు.

**नेनु रॊट्टॆलु तिनलेदु .**

నేను అన్నం తిన్నాను.

**नेनु अन्नं तिन्नानु .**



ఆ పిల్లి పాలు తాగింది.

**आ पिल्लि पालु तागिंदि .**

మా ఆవు గడ్డి మేయలేదు.

**मा आवु गड्डि मेयलेदु .**

మా ఎద్దులు గడ్డి మేశాయి.

**मा ऎद्दुलु गड्डि मेशायि .**

---

# పదమూడో పాఠం

# पदमूडो पाठं

మీరు నిన్న ఎక్కడికి వెళ్ళారు?
**मीरु निन्न ऍक्कडिकि वॆळ्ळारु ?**
మేము నిన్న సినిమాకు వెళ్ళాము.
**मेमु निन्न सिनिमाकु वॆळ्ळामु .**

మీరు ఇప్పుడు ఎక్కడికి వెళ్తున్నారు?
**मीरु इप्पुडु ऍक्कडिकि वॆळ्तुन्नारु ?**
మేము ఇప్పుడు బజారుకు వెళ్తున్నాము.
**मेमु इप्पुडु बजारुकु वॆळ्तुन्नामु .**



మీరు రేపు ఎక్కడికి వెళ్తారు?
**मीरु रेपु ऍक्कडिकि वॆळ्तारु ?**
మేము రేపు సినిమాకు వెళ్తాము.
**मेमु रेपु सिनिमाकु वॆळ्तामु .**

నీవు నిన్న ఎక్కడికి వెళ్ళావు?
**नीवु निन्न ऍक्कडिकि वॆळ्ळावु ?**

నేను నిన్న రవీంద్రభారతికి వెళ్ళాను.

नेनु निन्न रवींद्रभारतिकि वॆळ्ळानु .

నీవు ఇప్పుడు ఎక్కడికి వెళ్తున్నావు ?

नीवु इप्पुडु ऍक्कडिकि वॆळ्तुन्नावु ?

నేను ఇప్పుడు బజారుకు వెళ్తున్నాను.

नेनु इप्पुडु बज़ारुकु वॆळ्तुन्नानु .

నీవు రేపు ఎక్కడికి వెళ్తావు ?

नीवु रेपु ऍक्कडिकि वॆळ्तावु ?

నేను రేపు సినిమాకు వెళ్తాను.

नेनु रेपु सिनिमाकु वॆळ्तानु .

ఆయన నిన్న ఆఫీసుకు వెళ్ళారు.

आयन निन्न आफ़ीसुकु वॆळ्ळारु .

ఆమె నిన్న బజారుకు వెళ్ళలేదు.

आमॆ निन्न बज़ारुकु वॆळ्ळलेदु.

మీరు నిన్న ఆఫీసుకు వెళ్ళలేదు.

मीरु निन्न आफ़ीसुकु वॆळ्ळ लेदु .

నీవు నిన్న బడికి వెళ్ళలేదు.

नीवु निन्न बडिक्कि वॆळ्ळलेदु .

ఆ అమ్మాయి కూడా నిన్న బడికి వెళ్ళలేదు.

आ अम्मायि कूडा निन्न बडिक्कि वॆळ्ळलेदु .

రామయ్యగారు రేపు ఎక్కడికీ వెళ్ళరు

**रामय्यगारु रेपु ऍक्कडिकी वॆळ्ळरु .**

సీతమ్మగారు కూడా రేపు ఎక్కడికీ వెళ్ళరు.

**सीतम्मगारु कूडा रेपु ऍक्कडिकी वॆळ्ळरु .**

మేము రేపు సినిమాకు వెళ్ళము.

**मेमु रेपु सिनिमाकु वॆळ्ळमु .**

నేను రేపు బడికి వెళ్ళను.

**नेनु रेपु बडिकि वॆळ्ळनु .**

నీవు కూడా రేపు బడికి వెళ్లవు కదూ!

**नीवु कूडा रेपु बडिकि वॆळ्लवु कदू !**

నీవు రేపు హైదరాబాదు వెళ్తావు.

**नीवु रेपु हैदराबादु वॆळ्तावु .**

మీరు రేపు సికింద్రాబాదు వెళ్లరు కదూ!

**मीरु रेपु सिकिंद्राबादु वॆळ्लरु कदू ?**

వారుకూడా రేపు సికింద్రాబాదు వెళ్లరు.

**वारु कूडा रेपु सिकिन्द्राबादु वॆळ्लरु .**

# పధ్నాలుగో పాఠం

# पध्नालुगो पाठं

ఆయన నిన్న మీ ఇంటికి వచ్చారా?

**आयन निन्न मी इंटिकि वच्चारा ?**

అవును, ఆయన నిన్న మా ఇంటికి వచ్చారు.

**अवुनु, आयन निन्न मा इंटिकि वच्चारु .**

ఆయన మొన్న మా ఇంటికి రాలేదు.

**आयन मॊन्न मा इंटिकि रालेदु .**

రామయ్యగారు ఇప్పుడు మీ దుకాణానికి వస్తున్నారా?

**रामय्यगारु इप्पुडु मी दुकाणानिकि वस्तुन्नारा ?**

రామయ్యగారు ఇప్పుడు మా దుకాణానికి రావటం లేదు.

**रामय्यगारु इप्पुडु मा दुकाणानिकि रावटं लेदु .**

నరసయ్యగారు మా దుకాణానికి వస్తున్నారు.

**नरसय्यगारु मा दुकाणानिकि वस्तुन्नारु .**

ఆయన రేపు మీ ఇంటికి వస్తారా?

**आयन रेपु मी इंटिकि वस्तारा ?**

ఆయన రేపు మా ఇంటికి రారు.

**आयन रेपु मा इंटिकि रारु .**

ఆయన ఎల్లుండి మా ఇంటికి వస్తారు.

आयन ऍल्लुंडि मा इंटिकि वस्तारु .

ఆమె నిన్న మీ ఇంటికి వచ్చారా?

आमे निन्न मी इंटिकि वच्चारा ?

ఆమె నిన్న మా ఇంటికి రాలేదు.

आमे निन्न मा इंटिकि रालेदु .

ఆమె మొన్న రామయ్యగారి ఇంటికి వచ్చారు.

आमे मोन्न रामय्यगारि इंटिकि वच्चारु .

ఆమె రేపు మా ఇంటికి వస్తారు.

आमे रेपु मा इंटिकि वस्तारु .

కమలమ్మగారు ఆఫీసుకు వస్తున్నారా?

कमलम्मगारु आफ़ीसुकु वस्तुन्नारा ?

కమలమ్మగారు ఆఫీసుకు రావటం లేదు.

कमलम्मगारु आफ़ीसुकु रावटं लेदु .

సీతమ్మగారు రేపు మీ ఇంటికి వస్తారా?

सीतम्मगारु रेपु मी इंटिकि वस्तारा ?

సీతమ్మగారు రేపు మా ఇంటికి రారు.

सीतम्मगारु रेपु मा इंटिकि रारु .

రాధ రేపు మా ఇంటికి రాదు.

राध रेपु मा इंटिकि रादु .

మాధవరావు కూడా రేపు మా ఇంటికి రాడు.

माधवराव़ु कूडा रेपु मा इंटिकि राडु .

మీరు నిన్న కమలమ్మగారి ఇంటికి వెళ్ళారా?

मीरु निन्न कमलम्मगारि इंटिकि वेळ्ळारा ?

నేను నిన్న కమలమ్మగారి ఇంటికి వెళ్ళలేదు, రేపు వెళ్తాను.

नेनु निन्न कमलम्मगारि इंटिकि वॆ ळ्ळ लेदु, रेपु वॆ ळ्तानु .

నేను నిన్న మీ ఇంటికి రాలేదు.

नेनु निन्न मी इंटिकि रालेदु .

నేను నిన్న మీ ఆఫీసుకు వచ్చాను.

नेनु निन्न मी आफ़ीसुकु वच्चानु .

నేను ఇప్పుడు సినిమాకు వెళ్ళటం లేదు.

नेनु इप्पुडु सिनिमाकु वॆ ळ्ळटं लेदु .

నేను ఇప్పుడు బజారుకు వెళ్తున్నాను.

नेनु इप्पुडु बजारुकु वॆ ळ्तुन्नानु .

మా అబ్బాయి నిన్న మీ ఇంటికి వచ్చాడా ?

मा अब्बायि निन्न मी इंटिकि वच्चाडा ?

మీ అబ్బాయి నిన్న మా ఇంటికి రాలేదు.

मी अब्बायि निन्न मा इंटिकि रालेदु .

మీ అమ్మాయి ఇప్పుడు ఎక్కడికి
వెళ్తున్నది ?

मी अम्मायि इप्पुडु ऎक्कडिकि
वॆ ळ्तुन्नदि ?

మా అమ్మాయి ఇప్పుడు ఆంధ్రయువతీ
మండలికి వెళ్తున్నది.

मा अम्मायि इप्पुडु आंध्रयुवती मंडलिकि
वॆ ळ्तुन्नदि .

# పదిహేనో పాఠం

# पदिहेनो पाठं

మీరు మా ఇంటికి ఎప్పుడు వస్తారు ?

**मीरु मा इंटिकि ऍप्पुडु वस्तारु ?**

నేను మీ ఇంటికి రేపు వస్తాను.

**नेनु मी इंटिकि रेपु वस्तानु .**

మీరు ఈ రోజు మా ఇంటికి రారా ?

**मीरु ई रोजु मा इंटिकि रारा ?**

నేను ఈ రోజు మీ ఇంటికి రానండి.

**नेनु ई रोजु मी इंटिकि रानंडि .**

రాధా ! నీవు మా ఇంటికి ఎప్పుడు వస్తావు ?

**राधा ! नीवु मा इंटिकि ऍप्पुडु वस्तावु ?**

నేను మీ ఇంటికి రేపు వస్తానండి.

**नेनु मी इंटिकि रेपु वस्तानंडि .**

నీవు ఈ రోజు ఆఫీసుకు రావా ?

**नीवु ई रोजु आफ़ीसुकु रावा ?**

నేను ఈ రోజు ఆఫీసుకు రాను.

**नेनु ई रोज़ु आफ़ीसुकु रानु .**

ఆయన ఈ రోజు ఊరికి పోతారా ?

**आयन ई रोज़ु ऊरिकि पोतारा ?**

ఆయన ఈ రోజు ఊరికి పోరు.

**आयन ई रोज़ु ऊरिकि पोरु .**

ఆయన రేపు ఊరికి పోతారు.

**आयन रेपु ऊरिकि पोतारु .**

ఆమె కూడా రేపే ఊరికి పోతారా ?

**आमॆ कूडा रेपे ऊरिकि पोतारा ?**

ఆమె రేపు ఊరికి పోరు.

**आमॆ रेपु ऊरिकि पोरु .**

ఆ అమ్మాయి ఇక్కడే ఉంటుంది.

**आ अम्मायि इक्कडे उंटुंदि .**

ఆ అమ్మాయి ఊరికి పోదు

**आ अम्मायि ऊरिकि पोदु .**

ఆ అబ్బాయి కూడా ఇక్కడే ఉంటాడు.

**आ अब्बायि कूडा इक्कडे उंटाडु .**

ఆ అబ్బాయి ఊరికి పోడు.

**आ अब्बायि ऊरिकि पोडु .**

నేను దేవాలయానికి శనివారం వెళ్తాను.

नेनु देवालयानिकि शनिवारं वॆळ्तानु .

నేను ఆదివారం వెళ్ళను.

नेनु आदिवारं वॆळ्ळनु .

మా తమ్ముడూ నేనూ ఆదివారం సినిమాకు వెళ్తాము.

मा तम्मुडू नेनू आदिवारं सिनिमाकु वॆळ्तामु .

మేము శనివారం సినిమాకు వెళ్ళము.

मेमु शनिवारं सिनिमाकु वॆळ्ळमु .

రాధ కూడా శనివారం సినిమాకు వెళ్ళదు.

राध कूडा शनिवारं सिनिमाकु वॆळ्ळदु .

రాధా వసంతా కూడా శనివారం ఎక్కడికీ వెళ్ళరు.

राधा वसंता कूडा शनिवारं ऍक्कडिकी वॆळ्ळरु .

# పదహారో పాఠం

# पदहारो पाठं

మీరు వస్తున్నారా ?

**मीरु वस्तुन्नारा ?**

నేను రావటం లేదు.

**नेनु रावटं लेदु .**

మీరు వెళుతున్నారా ?

**मीरु वे ळुतुन्नारा ?**

మేము వెళ్ళటం లేదు.

**मेमु वे ळ्ळटं लेदु .**

ఆమె రావటం లేదు.

**आमे रावटं लेदु .**

ఆయన రావటం లేదు.

**आयन रावटं लेदु .**

ఆ అమ్మాయి మాట్లాడటం లేదు.

**आ अम्मायि माट्लाडटं लेदु .**

ఆ అబ్బాయి పని చేయటం లేదు.

**आ अब्बायि पनि चेयटं लेदु .**

ఆయన రావటం నీవు చూడలేదా ?

आयन रावटं नीवु चूडलेदा ?

ఆయన రావటం నేను చూడలేదు.

आयन रावटं नेनु चूडलेदु .

మీరు తెలుగు చదువుతున్నారా ?

मीरु तॆलुगु चदुवुतुन्नारा ?

నేను తెలుగు చదువుతున్నాను.

नेनु तॆलुगु चदुवुतुन्नानु .

మీరు కన్నడం కూడా చదువుతున్నారా ?

मीरु कन्नडं कूडा चदुवुतुन्नारा ?

నేను కన్నడం చదవటం లేదు.

नेनु कन्नडं चदवटं लेदु .

ఆ అబ్బాయి సంస్కృతం చదవటం లేదు,

హిందీ చదువుతున్నాడు.

आ अब्बायि संस्कृतं चदवटं लेदु,

हिन्दी चदुवुतुन्नाडु .

ఆ అమ్మాయి తెలుగు మాట్లాడటం లేదు,

కన్నడం మాట్లాడుతున్నది.

आ अम्मायि तॆलुगु माट्लाडटं लेदु,

कन्नडं माट्लाडुतुन्नदि .

మాధవరావు పనిచేయటం లేదు, మాట్లాడుతున్నాడు.

**माधवराव् पनिचेयटं लेदु, माट्लाडुतुन्नाडु .**

రాధ మాట్లాడటం లేదు, పని చేస్తున్నది.

**राध माट्लाडटं लेदु, पनि चेस्तुन्नदि .**

కమలమ్మగారు మా ఇంటికి రావటంలేదు, బజారుకు వెళుతున్నారు.

**कमलम्मगारु मा इंटिकि रावटं लेदु, बजारुकु वे ळुतुन्नारु .**

నేను చదవటం లేదు, రాస్తున్నాను.

**नेनु च़दवटं लेदु, रास्तुन्नानु .**

నేను మిమ్మల్ని పిలవటం లేదు,

మా స్నేహితుణ్ణి పిలుస్తున్నాను.

**नेनु मिम्मल्नि पिलवटं लेदु.**

**मा स्नेहितुण्णि पिलुस्तुन्नानु .**

మీరు పని చేయటం లేదు, మాట్లాడుతున్నారు.

**मीरु पनि चेयटं लेदु, माट्लाडुतुन्नारु .**

నీవు మాట్లాడటం లేదు, పని చేస్తున్నావు.

**नीवु माट्लाडटं लेदु, पनि चेस्तुन्नावु .**

ఆయన ఇంగ్లీషు మాట్లాడటం లేదు, హిందీ మాట్లాడుతున్నారు.

**आयन इंग्लीषु माट्लाडटं लेदु, हिन्दी माट्लाडुतुन्नारु .**

మనం మద్రాసు పోవటం లేదు, హైదరాబాదు పోతున్నాం.

**मनं मद्रासु पोवटं लेदु, हैदराबादु पोतुन्नां .**

# పదిహేడో పాఠం

ఆయన నిన్న ఎందుకు ఊరికి వెళ్ళారు ?

ఆయన నిన్న చుట్టాలను చూడటానికి ఊరికి వెళ్ళారు.

మీరు ఇప్పుడు ఎందుకు బజారుకు వెళ్తున్నారు ?

నేను ఇప్పుడు ఒక కలం కొనటానికి బజారుకు వెళ్తున్నాను.

మీరు రేపు ఎందుకు హైదరాబాదు వెళ్తారు ?

నేను రేపు మ్యూజియం చూడటానికి
హైదరాబాదు వెళ్తాను.

ఆ అమ్మాయి నిన్న ఎందుకు మీ ఇంటికి వచ్చింది ?

ఆ అమ్మాయి నిన్న మమ్మల్ని చూడటానికి మా ఇంటికి వచ్చింది.

రామయ్యగారు రేపు ఎందుకు ఊరికి పోతారు ?

రామయ్యగారు రేపు చుట్టాల్ని పిలవటానికి ఊరికి పోతారు.

మీరు రేపు ఎందుకు బజారుకు వెళ్తారు ?

నేను రేపు రేడియో కొనటానికి

బజారుకు వెళ్తాను.

ఆ అమ్మాయి రేపు ఎందుకు మీ ఇంటికి వస్తుంది ?

ఆ అమ్మాయి రేపు మా అమ్మను చూడటానికి మా ఇంటికి వస్తుంది.

మీ అబ్బాయి ఎందుకు షాదునగరు పోతాడు ?

మా అబ్బాయి ఉద్యోగం చేయటానికి షాదునగరు పోతాడు.

మీ తమ్ముడు ఎప్పుడు వస్తాడు ?

మా తమ్ముడు ఈ రోజు వస్తాడు.

అడుగో! మా తమ్ముడు ఇప్పుడే వస్తున్నాడు.

---

# పద్ధెనిమిదో పాఠం

మీరు ఈ రోజు సినిమాకు వస్తారా? రారా?

నేను ఈ రోజు సినిమాకు రానండి.

అయితే, మీరు ఎక్కడికి వెళ్తారు?

నేను రవీంద్ర భారతికి వెళ్తాను.

మీరు సికింద్రాబాదు వెళ్ళరా?

నేను సికింద్రాబాదు వెళ్ళను.

సరే, మీరు రవీంద్రభారతికి వెళ్ళండి.

మేము సినిమాకు వెళ్తాము.

మీరు సికింద్రాబాదు వెళ్ళకండి.

మీ అమ్మాయి సినిమాకు రాదా?

మా అమ్మాయి సినిమాకు రాదు.

మా అమ్మాయి కమలమ్మగారి ఇంటికి వెళ్తుంది.

రాధా! నీవు ఈ రోజు సినిమాకు వెళ్ళకు.

మీ అబ్బాయి సినిమాకు రాడా ?

మా అబ్బాయి ఈ రోజు సినిమాకు రాడు.

మా అబ్బాయి ఈ రోజు నాటకానికి వెళ్తాడు.

రాజూ ! నీవు ఈ రోజు నాటకానికి వెళ్ళు.

సినిమాకు వెళ్ళకు.

నీవు బజారుకు రావు.

నేను సినిమాకు రాను.

---

# పందొమ్మిదో పాఠం

నాకు నిన్న ఒక ఉత్తరం వచ్చింది.

నీకు కూడా నిన్న ఒక కవరు వచ్చింది.

మనకు మొన్న ఉత్తరాలు రాలేదు.

మా తమ్ముడూ మా చెల్లెలూ ఉత్తరాలు రాస్తారు.

నాకు ఈ రోజు సాయంత్రం టపాకు ఒక కార్డు వస్తుంది.

ఒక కవరు కూడా వస్తుంది.

నాకు ఈ రోజు రెండు ఉత్తరాలు వస్తాయి.

మా నాన్నగారికి ఉత్తరాలు రావటం లేదు.

ఆదివారం టపా రాదు.

మాకు ఆదివారం ఉత్తరాలు రావు.

ఈ రోజు మాధవరావు వస్తాడు, నరసింగరావు రాడు.

ఈ రోజు రాధ ఆఫీసుకు వస్తుంది, లలిత రాదు.

ఈ ఉత్తరం ఎవరికి వచ్చింది ?

ఈ ఉత్తరం మీకు వచ్చింది.

ఈ కవరు ఎక్కడినుంచి వచ్చింది ?

ఈ కవరు విజయవాడనుంచి వచ్చింది.

ఈ ఉత్తరాలు వరంగల్లునుంచి వచ్చాయి.

ఈ రోజు నాకు రాజమండ్రినుంచి ఉత్తరం రాలేదు.

రేపు ఆదివారం ఉత్తరాలు రావు.

# ఇరవైయో పాఠం

మీ నాన్నగారు ఎక్కడ ఉన్నారు ?
మా నాన్నగారు వరంగల్లులో ఉన్నారు.
మా నాన్నగారు ఇప్పుడు విజయవాడలో లేరు.

కమలమ్మగారు ఎక్కడ ఉన్నారు ?
కమలమ్మగారు విజయవాడలో ఉన్నారు.
కమలమ్మగారు ఇప్పుడు కరీంనగర్లో లేరు.

మాధవరావు హైదరాబాదులో ఉన్నాడా ?
మాధవరావు హైదరాబాదులో లేడు.
మాధవరావు వరంగల్లులో ఉన్నాడు.

రాధ ఎక్కడ ఉన్నది ?
రాధ విశాఖపట్టణంలో ఉన్నది.

విజయలక్ష్మి విశాఖపట్టణంలో లేదా ?
విజయలక్ష్మి విశాఖపట్టణంలో లేదు.

మీరు ఇప్పుడు ఎక్కడ ఉంటున్నారు ?
మేము ఇప్పుడు రాజమండ్రిలో ఉంటున్నాము.
మేము ఇప్పుడు కాకినాడలో ఉండటం లేదు.

నీవు ఇప్పుడు ఇక్కడే ఉంటున్నావా ?

అవునండి. నేను ఇక్కడే ఉంటున్నాను.

మీ మామగారు తిరుపతిలోనే ఉంటున్నారా ?

అవునండి. ఆయన తిరుపతిలోనే ఉంటున్నారు.

సీతమ్మగారు కూడా అక్కడే ఉంటున్నారా ?

ఆమె అక్కడ ఉండటం లేదు.

ఆమె భద్రాచలంలో ఉంటున్నారు.

రామయ్యగారు కూడా భద్రాచలంలోనే ఉంటున్నారా ?

అవునండి. వారు కూడా భద్రాచలంలోనే ఉంటున్నారు.

భారతి ఇప్పుడు గుంటూరులో ఉంటున్నది.

ఇందిర ఇప్పుడు అక్కడ ఉండటంలేదు.

ఆ అమ్మాయి ఇక్కడే ఉంటున్నది.

రంగారావు ఇప్పుడు హైదరాబాదులోనే ఉంటున్నాడు.

మీ నాన్నగారూ మీ అమ్మగారూ ఇప్పుడు
హైదరాబాదులోనే ఉంటున్నారా ?

అవునండి. మేము అందరం ఇప్పుడు ఇక్కడే ఉంటున్నాము.

మీ ఊళ్ళో చక్కెర బాగా దొరుకుతున్నదా ?

మా ఊళ్ళో చక్కెర బాగా దొరుకుతున్నది.

మా ఊళ్ళో చక్కెర దొరకటం లేదు.

అవునండి. కొన్ని ఊళ్లల్లో చక్కెర దొరకటం లేదు.

మా ఊళ్ళో పాలు దొరకటం లేదు.

# ఇరవై ఒకటో పాఠం

మీ నాన్నగారు ఎప్పుడు ఇంట్లో ఉంటారు ?
మా నాన్నగారు సాయంత్రం ఇంట్లో ఉంటారు ;
ఉదయం ఇంట్లో ఉండరు.

మీరు సాయంత్రం ఆఫీసులో తీరికగా ఉంటారా ?
నేను సాయంత్రం ఆఫీసులో తీరికగా ఉండను ;
మధ్యాహ్నం ఆఫీసులో తీరికగా ఉంటాను.

మీ నాన్నగారూ మీరూ ఉదయం ఇంట్లో ఉంటారా ?
మా నాన్నగారూ నేనూ ఉదయం ఇంట్లో ఉండము ;
మేము సాయంత్రం ఇంట్లో ఉంటాము.




మీ ఇంట్లో పోతన్నగారి భాగవతం ఉన్నదా ?
మా ఇంట్లో పోతన్నగారి భాగవతం ఉన్నది ;
తిక్కన్నగారి భారతం కూడా ఉన్నది.

మీ ఇంట్లో తులసీ రామాయణం లేదా ?
మా ఇంట్లో తులసీ రామాయణం లేదు ;
వాల్మీకి రామాయణం కూడా లేదు.

మీ ఇంట్లో దోమలు ఉన్నాయా ?
మా ఇంట్లో దోమలు లేవు ;
ఈగలు ఉన్నాయి.

ఆ సినిమా బాగున్నదా ?
ఆ సినిమా బాగా లేదు.
జమున నటన చాలా బాగున్నది.
ఆ సినిమాలో పాటలు బాగున్నాయి ;
పద్యాలు బాగా లేవు.

ఆ సినిమాలో భానుమతి లేదా ?
ఆ సినిమాలో భానుమతి లేదు ;
జమున ఉన్నది.

ఆ సినిమాలో రమణారెడ్డి లేడా ?
ఆ సినిమాలో రమణారెడ్డి లేడు ;
పద్మనాభం ఉన్నాడు.

ఈ బుట్టలో ఏమి ఉన్నాయి ?

ఈ బుట్టలో వంకాయలు, బెండకాయలు ఉన్నాయి.

పాలకూర లేదా ?

పాలకూర లేదు ; గోంగూర ఉన్నది.



ఈ పెట్టెలో పుస్తకాలు లేవా ?

ఈ పెట్టెలో పుస్తకాలు లేవు ;

కాగితాలు ఉన్నాయి.

ఈ బస్సులో కూర్చోటానికి చోటు లేదు.

నేను రైల్లో వెళ్తాను. మీరు కూడా రండి.

రైలు డబ్బాలో కూర్చోటానికి చోటు ఉంటుంది.



# ఇరవై రెండో పాఠం



అతను కుక్కను కొట్టాడు.

అతను కుక్కను దేనితో కొట్టాడు ?

అతను కుక్కను కర్రతో కొట్టాడు.

రాజూ ! నీవు రేపు ఎవరితో వస్తావు ?

నేను రేపు మా నాన్నగారితో వస్తాను.

ఆయన మీ ఇంటికి సామానుతో రాలేదా ?

ఆయన మా ఇంటికి సామానుతో రాలేదు.

ఏమండీ ! మీరు రొట్టెలు దేనితో చేస్తున్నారు ?

నేను రొట్టెలు నేతితో చేస్తున్నానండి.

మీరు రొట్టెలు నూనెతో చేయరా ?

నేను రొట్టెలు నూనెతో చేయను.



ఆయన నీతో ఏ భాష మాట్లాడుతున్నారు ?
ఆయన నాతో తెలుగు మాట్లాడుతున్నారు.

మీరు ఆమెతో మాట్లాడారా ?
నేను ఆమెతో మాట్లాడలేదు.
ఆమె ఆయనతో మాట్లాడుతున్నారు.
ఆయన ఆమెతో మాట్లాడుతున్నారు.

రాధ నీతో ఏమిటి అంటున్నది ?
రాధ నాతో ఏమీ అనటం లేదు.

రాధ మీతో చదువుతున్నదా ?
రాధ మాతో చదవటం లేదు.

నరసయ్య రామయ్యతో ఏమిటి అంటున్నాడు ?
నరసయ్య రామయ్యతో ఏమీ అనటం లేదు.

ఆ అమ్మాయి కమలమ్మగారితో ఏమి చెబుతున్నది ?
ఆ అమ్మాయి కమలమ్మగారితో ఏమీ చెప్పటం లేదు.

ఆ అమ్మాయి ఆ అబ్బాయితో
మాట్లాడుతున్నది.
ఆ అబ్బాయి ఆ అమ్మాయితో
మాట్లాడటం లేదు.



# ఇరవై మూడో పాఠం




ఇప్పుడు ఎన్ని గంటలు అయింది ?
ఇప్పుడు రెండు గంటలు అయింది.

ఈ పని ఎప్పటికి అవుతుంది ?
ఈ పని సాయంత్రం అయిదున్నరకు అవుతుంది.

ఈ పని మూడు గంటలకు కాదా ?
ఈ పని మూడు గంటలకు కాదు.

ఈ పని తొందరగా అవుతున్నదా ?
ఈ పని తొందరగా కావటం లేదు.

ఆయన ఎక్కడినుంచి వచ్చారు ?
ఆయన తెనాలినుంచి వచ్చారు.

మీరు ఎక్కడినుంచి వస్తున్నారు ?
నేను బజారునుంచి వస్తున్నాను.

మీరు రేపు ఇక్కడినుంచి ఎక్కడికి వెళ్తారు ?
నేను రేపు ఇక్కడినుంచి చిక్కడపల్లికి వెళ్తాను.

ఆ అమ్మాయి ఎక్కడినుంచి వస్తున్నది ?
ఆ అమ్మాయి ఆంధ్ర మహిళాసభనుంచి వస్తున్నది.

నీవు ఈ పుస్తకం మొదటినుంచి చదువుతున్నావా ?
నేను ఈ పుస్తకం మొదటినుంచి చదవటం లేదు.
నేను ఈ పుస్తకం సగంనుంచి చదువుతున్నాను.

మీరు ఈ పుస్తకం మొదటినుంచి చివరిదాకా చదవండి, బాగుంటుంది.

హైదరాబాదులో మీ పనులు పూర్తి అయినాయా ?
అవునండి, మా పనులు అన్నీ పూర్తి అయినాయి.

మీ అబ్బాయి పరీక్ష నెగ్గాడా ?
మా అబ్బాయి పరీక్ష నెగ్గలేదు.
లలితకూడా పరీక్ష నెగ్గలేదు.

ఏమండీ ! ముఖ్యమంత్రి ఎవరు అయినారు ?
శ్రీ రెడ్డిగారు ముఖ్యమంత్రి అయినారు.

# ఇరవైనాలుగో పాఠం



నాన్నగారూ! మీ కోసం
రంగారావుగారు వస్తున్నారు.
నమస్కారమండి,
రంగారావుగారూ! రండి.
ఈ కుర్చీలో కూర్చోండి.

నమస్కారమండి,
మీరు నా కోసం వచ్చారా?
అవునండి, నేను మీ కోసం వచ్చాను.

వారు ఎవరికోసం వచ్చారు?
వారు కూడా మీ కోసమే వచ్చారు.

ఈ అమ్మాయి మీ అమ్మాయా?
కాదండి! ఈ అమ్మాయి మీ అమ్మాయికోసం వచ్చింది.

అమ్మాయీ! ఇలా రా! నీ పేరు ఏమిటి?
నా పేరు విజయ. నేను మీ అమ్మాయికోసం వచ్చాను.
రాధా! ఇలా రా! నీ కోసం ఒక అమ్మాయి వచ్చింది.
నాన్నగారూ! ఈ అమ్మాయి నా స్నేహితురాలు విజయ.
మంచిది. ఆ గదిలో కూర్చోండి.

నాల్గో పాఠం

మీ - तुम्हारा

పేరు - नाम

అండి - जी (आदरसूचक)

స్నేహితుడి - दोस्त का

ఊరిపేరు - गांव का नाम

పాఠం

का

అబ్బాయికి - लडके को

ఆయనకు - उनको

ఇల్లు - घर

మీకు - तुमको

పేర్లు - नाम (बहुवचन)

ఇతనికి - इसको

ఎవరికి - किन को ?

తెలియదా ? - नहीं मालूम ?

ఏమండీ - अजी

వారికి - उनको

ఓటు - मत

ఐదో పాఠం

మీరే - तुम्हीं को

ना

మాది - हमारा

నావి - मेरे

ఆవులు - गायें

మావి - हमारे

ఉంగరము - अंगूठी

ఈ యిల్లు - ये घर

మేకలు - बकरियाँ

అతనివి - उनकी

చిచ్చుబుడ్డి - फुलझडी

ఈ పిల్లవాడిది - इस लडके की

కుక్కలు - कुत्ते

ूम

వాళ్లవి - उनके

గొడుగు - छतरी
దుకాణం - दूकान
అద్దం - आइना
దువ్వెన - कंघी

### ఎనిమిదో పాఠం

మీది - तुम्हारा
మాది - हमारा
వాళ్లది, వారిది - उनका
ఆమెది - उसका
ఇతనిదా ? - इसका है ?
కాదు - नहीं
సంచి - थैली
నాదా ? - मेरा है ?

### తొమ్మిదో పాఠం

ఎంత - कितना
ఎన్ని - कितने
యాభై - पचास
ధర - दाम, कीमत
వయస్సు - उम्र
ఇరవయి - बीस
ముప్పయి - तीस
ఏండ్లు - वर्ष, साल
తమ్ముడు - छोटा भाई
పదిహేను - पन्द्रह
నలభయి - चालीस

### పదో పాఠం

ఇటు - इधर
రా - आ
రాకు - मत आ
ఇద్దరు - दोनों
మీరు - तुम
మొదటి - पहला
చివరి - आखिरी
చదువు - पढो
చదవకు - मत पढो
చెడ్డ - बुरा, बुरे
నవలలు - उपन्यास
ఇక వెళ్లు - अब जाओ
వెళ్లు - जाओ
వెళ్లకు - मत जाओ
ఇక్కడ - यहाँ
కూర్చో - बैठो
కూర్చోకు - मत बैठो
రండి - आइये
కూర్చోండి - बैठिये
కూడా - भी
కూర్చోకండి - मत बैठिये
ఔషధము - दवा

అందరు - सब
గుణింతము - बारह खडी

## పదకొండో పాఠం

పండ్లు - फल
అమ్మటం - बेचना
కొనటం - खरीदना
[illegible] - [illegible]ना

చూడటం - देखना
పాటలు - गीत
వినటం - सुनना
మాట్లాడటం - बोलना
పోట్లాడటం - झगडना
బజారు - बाजार
కాయకూరలు - तरकारियाँ
తేవటం - लाना
కంటె - की अपेक्षा, से
చాలా - बहुत

## పన్నెండో పాఠం

చూశారా ? - देखा ?
తిన్నావా - खाया ?
పిల్లి - बिल्ली
పాలు - दूध
తాగింది - पिया
గడ్డి - घास
మేయుట - चरना

## పదమూడో పాఠం

నిన్న - कल (गत दिन)
ఎక్కడికి - कहाँ
వెళ్లారు - गये
ఇప్పుడు - अब
వెళ్లుతున్నారు - जा रहे हैं
రేపు—कल
వెళ్తారు - जायंगे
బడి—पाठशाला
కూడా - भी, साथ
ఎక్కడికీ—कहीं भी
కదూ - नहीं

## పద్నాలుగో పాఠం

వచ్చారా ? - आये ?
అవును - हाँ
మొన్న - परसों (गत)
రావటం - आना
వస్తారా - आयेंगे
రారు - नहीं आयेंगे
ఎల్లుండి - परसों (आगे)

## పదిహేనో పాఠం

ఈరోజు - आज
ఎప్పుడు - कब
ఇక్కడే—यहीं भी
దేవాలయము—मंदिर
ఎక్కడికీ - कहीं भी

## పదహారో పాఠం

మాట్లాడటం - बोलना
పని - काम
చేయటం - करना
పిలవటం - बुलाना
పోవటం - जाना

## పదిహేడో పాఠం

ఎందుకు - क्यों ?
చుట్టాలు - रिश्तेदार
కొనటానికి—खरीदने
పిలవటం - बुलाना
ఇప్పుడే - अभी

## పద్దెనిమిదో పాఠం

సరే—ठीक
నాటకం - नाटक

## పందొమ్మిదో పాఠం

ఉత్తరం—खत, पत्र
సాయంత్రం - शाम को
ఎక్కడినుంచి - कहाँ से

## ఇరవయ్యో పాఠం

ఇక్కడే - यहीं
అవునండి - जी हाँ
మామ - मामा
చక్కెర - चीनी, शक्कर
బాగా — खूब, अच्छा
దొరకుట - मिलना

## ఇరవయి ఒకటో పాఠం

ఉదయం - सवेरे
తీరికగా - फुरसत में
మధ్యాహ్నం - दुपहर
దోమలు - मच्छर
ఈగలు - मक्खियाँ
నటన - अभिनय
పాటలు - गीत
పద్యాలు - पद्य
లో - में
బుట్ట - टोकरी
వంకాయలు - बैंगन

బెండకాయలు - भिंडी
పాలకూర - पालक की भाजी
గోంగూర - पिटुआ
పెట్టె - पेटी
చోటు - जगह

### పదములు రెండో పాఠం

కుక్క - कुत्ता
దేనితో - किससे
కర్ర - डंडा
ఎవరితో - किसके साथ
నేతితో - घी
నూనె - तेल
ఏమీ - कुछ भी
అనటం - कहना
చెప్పటం - बनाना

### పదములు మూడో పాఠం

ఎన్ని - कितने
గంటలు - बजे
ఎప్పటికి - कब तक
అయిదున్నర - साढे पांच
తొందరగా - जल्दी
మొదటినుంచి - शुरू से
సగం - आधा
చివరిదాకా - आखिर तक
నెగ్గుట - उत्तीर्ण होना

### పదములు నాలుగో పాఠం

కొఱకు, కోసం - के लिये
గది - कमरा

---